శ్రీ

# గ్రంథావతారము

---

మ॥ ధరణిం బిల్లలమఱ్ఱివంశమణి యు
ద్యద్వేదవేదాంగసం
భరితుం డధ్వరసంచయార్జితహవి
ర్భాగాభిసంతోషితా
మరుఁడుర్వ శ్రీత్రిపురాంబికార్చకుఁడు స
న్మాన్యుండునౌ చంద్రశే
ఖర నామాంకిత యజ్వశేఖరుఁడు లో
కస్తవ్యుఁడై యొప్పెడిన్॥

ఉ॥ ఆపరమార్థవిత్తముని య
న్వయమందున విప్రరత్నమై

పాపనయజ్వ గల్గి తలఁ
పర్వ పులిచింతలయగ్రహారముం
భూపతి వేడఁగ్గ కొనియెఁ
బుత్రికలందునఁ జేరి భూమలెం
తేపనిఁదాల్చి బాల తన
యింటఁ జరించుఁ దపంబదెట్టిదో॥

గీ॥ వెలయు పాపనయజ్వకు వేంకటపతి
సోమయాజి, లక్ష్మీపతి సోమయాజి
మనమలైరి లక్ష్మీపతి ఘనుఁడుగనియె
నతితపస్వి వేంకటకృష్ణ యజ్వవరుని॥

ఉ॥ వేంకటకృష్ణయజ్వకిల
వేరుసమానుడు గల్గడంచు ని
శ్శంకగఁదెల్పవచ్చు గురు
శంకరుఁడాతని వందనంబుగై
జంకెను వేంకటాద్రిపృప
చంద్రుఁడువచ్చి పరీక్షసేయ ని

శృంకలఁ జిత్రయోగముల
సల్పెను వారిప్రభావమెట్టిదో ?

కం॥ తగునని యిడఁగొనియె బుధుఁ
డగు వేంకటకృష్ణయజ్వ యన్వయమెల్లం
దగ జీవింపఁగఁగారణ
మగు మలకాపురము నగ్రహారముగాఁగన్ ॥

సీ॥ కలితయశుండు వేంకటపతి యజ్వతా
నుబ్బయాఖ్యానుఁడౌ సుతునిగాంచె
పరగనాబుధుఁడు సుబ్రహ్మణ్యమనుపుత్ర
వర్యుఁగాంచెను బుణ్యకార్యనిరతు
నంతసుబ్రహ్మణ్య మన్నపూర్ణంబోలు
నన్నమ్మయను కన్నె మిన్నయందు
నాగలింగంబు, కృష్ణయ పూర్ణసిద్ధాంతి
దక్షిణామూర్తినా దనరునట్టి
నందనచతుష్టయముఁగనె నందమంద
నందుఁ బూర్ణయసిద్ధాంతి యఖిలదేశ

ములను సిద్ధాంతిమణియశమ్మును గణించి
యమలమతిని బ్రహ్మీభూతుఁడయ్యెఁదాను ॥

సీ॥ వసుధబిల్లలమఱ్ఱి వంశాబ్ధిచంద్రుండ
నంగనొప్పెడి నాగలింగమణికి
వితతసద్గుణగణాన్విత వేంకమాంబకు
నాత్మజులిరువురం దగ్రసుతుఁడు
సోమయాజులు బుధస్తోమమాన్యుఁడు మహో
ద్యోగయుతుండు పరోపకారి
యగ్రజసన్నిభుం డమలగుణుండు మా
నితకీర్తిబుధుఁ డాంజనేయశాస్త్రి
హితుఁదత్త్వచింతాభిరతు ములుకుట్ల వేం
కటకృష్ణనాముని గాంచినన్ను
తెలుపుఁడిటమాకు నిలువేల్పు త్రిపురసుంద
రీమహాదేవి స్తవమన, నే ముదంబు
గుదుర నక్షత్రమాలిక గూర్చి భక్తి
వెలయు జగదంబకిది సమర్పించినాఁడ ॥

చ॥ ప్రకటయశోవిశాలు రతి
భాసురభవ్యకళావిశారదుల్
వికసితరాజకీయ పద
వీ మహితాత్మకులైన సోమయా
జికి మఱి యాంజనేయునకు
శ్రీసుత భాగ్యచిరాయురాదులు
త్సుకతనొసంగి యాత్రిపుర
సుందరి । బోచుత నెలకాలము॥

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీత్రిపురసుందర్యై నమః

శ్రీ శివాయగురవేనమః

శ్రీ గణేశ్వరాయనమః శ్రీ మహాసరస్వత్యై నమః



# శ్రీత్రిపురసుందరీనక్షత్రమాల

ఉ॥ శ్రీకరుణాకటాక్ష నత
సేవకపాలన బద్ధదీక్షుసు
శ్లోకమనీషిపక్షుమణి
శోభితభూషణ వక్షభక్తవాం
ఛాకలనాతిదక్ష నిను
సంస్తుతిసల్పెద బ్రోవుమమ్మయ
స్తోకదయాబ్ధివై త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 1

చ॥ అజునకు సృష్టిశక్తి, దను
జారికిరక్షణశక్తి, నావృష
ధ్వజునకు సర్వసంహృతివి
ధాయకశక్తి నొసంగియెల్లఱుం
భజనమొనర్ప నిత్యమహి
మన్ వెలుగొందుచు నాదిశక్తివై
సుజనులబ్రోతువో త్రిపుర
సుందరిమంజుల కంబుకంధరీ॥ 2

చ॥ ధవుఁడఖిలజ్ఞుఁడీశుఁడు సు
త్రప్రవరుల్ సకలార్చనీయులున్
సవతిమహాగ్రపాతకవి
నాశనిగేహము వెండికొండనే
భవమున సర్వమంగళ వి
భాసురనాకము బోలియేలయుం
చు విడకుమమ్మ శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 3

చ॥ అరయఁగ నామరూపముల
నందని పెన్మిటి, బెండ్లియాడినీ
నిరుపమశక్తిచేఁ బతిక
నేకవిధంబగు నామరూపముల్
విరచనఁజేసి పూజ్యవయి
వీడకయుంటివి నీచమత్కృతుల్
సారిదివిచిత్రమో త్రిపుర
సుందరిమంజులకంబుకంధరీ॥ 4

ఉ॥ వేదములాటపట్లువిధి
విష్ణుశివుల్ ప్రియనందనుల్, నిలిం
పాదులుసేవకుల్, స్థితిల
య్యాదులునీకువిలాసముల్, వికుం
ఠాదులుబొమ్మరిండ్లు, మహి
తాత్ములచిత్తమువాస, మజ్ఞతా
సూదననీకు శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 5

ఉ॥ అమ్మ, మొరాలకింపఁగద
వమ్మ, సదాగతివంచునిర్మదిర్మ
నమ్మితినమ్మ, పూర్ణకరు
ణంగనుమమ్మ, పరాకుబూనకో
యమ్మ, దయాబ్ధివమ్మ, శిర
ణంటిఁగదమ్మ, ధ్రువంబునిర్మ విడం
జుమ్మనిశమ్ము శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 6

చ॥ కినుకనిరాకరింప నప
　　　　కీర్తిఁ, మొరల్ వినకున్న గర్వ, మ
న్యునిదరి శేరనీమవరు
　　　　వుండదు, జాలినిబూన్వధర్మమె
ల్లను జెమఁ, గానన్ను సుతు
　　　　లాగునగాంచి ప్రతిష్ఠ నిల్పుమీ
సునుగొనకమ్మ శ్రీత్రిపుర
　　　　సుందరి మంజులకంబుకంధరీ॥ 7

చ॥ మొరలిడ నాదు చెంతకు వి
　　　　భుఁ విడి రామన సొప్పదో, నిరం
తరమును రాజితాద్రిపయి
　　　　తర్షలుదీరవో, యట్లులైన నీ
వరసహితంబుగా నిటకు
　　　　వచ్చి విరాజిత మన్మనోగిరిఁ
సురుచి వసింపుమో త్రిపుర
　　　　సుందరి మంజులకంబుకంధరీ॥ 8

ఉ॥ పండితకోటులైనను భ
వత్సుఖకంద నితాంత నిర్మలా
ఖండ సరోజజాండ ముఖ
కారణ విస్మయ రూపమెన్న లే
కుండిరి నేనునేర్తునన
నొప్పునె, వాదనమాచరింతు దా
నుండని బ్రోవుమా త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 9

చ॥ అరులకుఁ జూడమేమరభ
యావహ, మర్భకకోటి దృష్టికిన్
సురుచిర దివ్యమంగళము
నూరులకున్ సకలార్థ మూలమున్,
నిరుపమ తత్త్వవేత్తలకు
నిత్యసుఖంబగు నీస్వరూపమే
సురలకు నెన్ననా త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 10

చ॥ పురుషులు పూరుషార్థములఁ
బూని పనుల్ ఘటియించువేళ నిర్
స్థిరమతి నెంత్రుముం దఖల
సిద్ధిఁగొనర్పెదవంచు, నెల్ల మం
దిరముల సుందరీ మణులు
నిత్యసువాసినివంచు నిన్నదర్
సారిది నుతింతురో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 11

చ॥ అభవునికొమ్మ, నన్నిటుల
నారడిబెట్టుట మేలటమ్మ, నీ
దు భజనమాననమ్మ, యిక
దోషములెన్నకుమమ్మ నాదు హృ
త్సభనిలుమమ్మ, దుర్గతుల
దార్చకుమమ్మ, నిరంతరంబునర్
శుభములనిమ్మ, శ్రీ త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 12

ఉ॥ భ క్తి గలుంగువారలకు
భాగ్యము భోగ్యము కార్య ధుర్య ధీ
యు క్తిజనానురక్తి మహి
తోన్నతశక్తి సుభుక్తిముక్తినా
సక్తినొసంగు దాత్రివని
చాలగ వేడితి గానవాకిదే
నూక్తిఘటింపువో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 13

చ॥ అతులిత సద్వరంబులిడు
నట్టి సురల్ గలరైనగాని యా
యితరులొసంగు తద్వరము
లెల్లను నీకొక గోటిలోనికిన్
జతపడ, వింతయేల యుల
చక్రిని గోళ్లను నిల్పలేదె యో
శ్రుతిపథగోచరీ త్రిపుర
సుందరి మకజులకంబుకంధరీ॥ 14

ఉ॥ ఏ నొనరించుచుంటినని
యెల్లను పాపములైనగాని నే
వానికి భీతినొందనల
భానుఁడు గాఢతమంబువోలె నీ
ధ్యానమడంచు గావునను
దాని నొసంగుము దోసిలొగ్గితిన్
మానని భాంగి శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 15

ఉ॥ పారముముట్ట వీవిషయ
వాంఛలు, మోహమడంగిపోవ, దా
చారముసున్న, నిల్వదెద
శాంతము, చిత్తమునిల్పజాల, ని
ష్కారణమైన నీకృపనుగాక
నినుంగన నేర్చువాఁడ నే
సూరిజనేడ్య శ్రీత్రిపుర
సుంధరి మంజులకంబుకంధరీ॥ 16

ఉ॥ పున్నెమొకన్చియే నెఱుఁగ,
భూరితరంబగు పాపకార్యముల్
మిన్నక చేసినాఁడ, నిక
మీఁదెటులో, శరణంటినీకు, నా
పన్నశరణ్య! నాదయిన
ప్రాప్తమునీమనసెట్టులున్నదో
సున్ననుజుట్టకో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 17

చ॥ దురితపథంబునం జొరక
దుష్టమనంబెటునిల్పు? నీపదాం
బురుహాసమర్చనంబునను
బుద్ధికినిల్కడయెట్లుగల్గు? నిర్జ
వరముల వేడఁగాఁదగిన
భాగ్యమదెప్పుడుగల్గు? తెల్పుమీ
స్ఫురితదయామయీ త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 18

చ॥ ననుసకలేశ్వరీ దృఢమ
నంబుననిల్పినుతింపలేవు నీ
యనకుము, కొండయంతటిమ
హాత్మ్యనకుందగుఁ గొండయంతప
త్రినొసఁగువారలుర్విఁ గల
రేయొకదండమొసంగు వాఁడదా
సునిగనుమమ్మ శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 19

చ॥ జననిరో నీదువర్ణనకుఁ
జాలినవస్తువు లేకయుంటనే
మనుచువచింతువాఙ్మనసు
లందవటందురు సర్వలోకమో
హినివగునీదుచక్కదన
మీశుఁడుగాకితరుం డెఱుంగనే
ర్చునె? జగదంబ! శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 20

చ॥ ఎడనెడదుర్గ్రహంబులు మ
హీస్థలిపైబడి ప్రాణికోటులం
గడువడి బాధసల్పునెడ
గ్రమ్మఱఁదానక బీజవర్ణముల్
నుడివినిర్మ స్మరింపదవ
నుడుపయింబక మి ద్దలట్లుగా
సుడివడిపోనె శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 21

ఉ॥ భూతినిబూసి, యాపుడుక
పూసలుదాల్చి, శ్మశానవాటిలో
నేతిరుగాడు చుందిరిపె
మెత్తుచుఁబాముల పేర్లుబూనుసీ
చేతనధీశుఁగా, శశిమ
ణీయుతుఁగా, బహుదాతఁగా, జగ
త్ఖ్యాతిఁగఁ, జేసితో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 22

చ॥ ఒకఁడిడెఁ బాదదానము, మ
ఱొకఁడుఁ డర్ధము సంగె, నూఁడుపా
తికలిడ వేఱొకండు, వెలి
తింగొనసీయక సర్వమిచ్చితి
వకలుషితాంతరంగయుతు
లైన మహాత్ములకంచు వేడిరిఁ
శుకమృదువాణి శ్రీ త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 23

ఉ॥ కొందఱు శత్రునాశమున
కుఁ మఱిగొందరు వైభవంబుకై,
కొందఱు పుత్రరాజకొఱ
కుఁ మఱి గొందఱు జ్ఞానవృద్ధికిఁ
గొందఱు భుక్తిముక్తులకుఁ
గొత్రఫలంబు నొసంగి నీదు దా
సుందరి జేర్పునం త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 24

చ॥ అవిరళ దివ్యరత్నమకు
టాన్వితమై తిలకాభిరామమై
నవజలజేక్షణాద్వితయ
నందితమై మణిభూషణాఢ్యమై
ప్రవిమల పూర్ణచంద్రువలె
భాసిలు నీ నగుమోము నాదు చ
క్షువులకుఁ జూపుమా త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 25

ఉ॥ మంగళమూర్తివై సకల
మంగళముల్ పొనరించు నీకు నే
మంగళహారతుల్ విమల
మానసవీధి ఘటింతు నిత్యముఁ
మంగళముల్ ఘటించుచు న
మంగళముల్ దొలఁగించి నీవు దా
సుం గరుణింపుమం త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 26

ఉ॥ పావనచిత్తులై వెలయు
భక్తుల కాన్కల కాసఁబూనినా
నోవనజాయతాక్షి యిదె
యుత్పల చంపకమాలికాఢ్య తా
రావళి నిత్య నిర్మల స
మంచిత భక్తిని నీకొసంగితిఁ
నూవె గ్రహింపుమో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 27

చ॥ కలితకృపాకటాక్షమునఁ గాంచుచుఁ బిల్లలమఱ్ఱి
వంశ్యులన్ । విలసిత నాగలింగ బుధ వేంకమ్మ పు
త్రులఁ బ్రీతి సోమ,యా।జులు మఱియాంజనేయుఁడ
ను సోదరులన్ నినునమ్మికొల్చు దా।నులమమునే
లుమో త్రిపురసుందరి మంజులకంబుకంధరీ॥ 28

శ్రీ త్రిపుర సుందరీ పరదేవతార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

